## గంటల పంచాంగం

శ్రీ విజయ సం॥ కార్తీక బ॥ ద్వాదశి 1953 సం॥ డిశంబరు 3 గురువారం
గు॥ ద్వాదశి ప 12-35 స్వాతి [illegible]
వర్జ్యం ప 8-53 ల 10-38 వ.
బ॥ త్రయోదశి డిశంబరు 4 శుక్రవారం
శు॥ త్రయోదశి ప 2-17 విశా 24-0
వర్జ్యం ప 11-7 ల 12-51 వ.


# ఆంధ్రపత్రిక

[illegible] (మహాభారతము)

శ్రీ విజయ సం॥ కార్తీక బ॥ ద్వాదశి
గురువారం


## 'ద్వితీయమ్'

ఆంధ్రమంత్రివర్గం రాష్ట్ర అసెంబ్లీలో వారం తిరక్కముందే రెండవ పరాజయాన్ని పొందింది. మంత్రుల జీతాలు వెయ్యిరూపాయలు వుండాలని ప్రభుత్వం ప్రతిపాదించిన బిల్లు కోరింది. మంత్రులజీతం అయిదు వందల రూపాయలే వుండాలని అసెంబ్లీ నిర్ణయించింది. అధికారంకంటే ఆత్మగౌరవాన్ని వదవులకంటే ప్రతిష్ఠను ప్రాణప్రదంగా ఎంచే మంత్రివర్గం ఏదైనా అసెంబ్లీ తమ ప్రతిపాదనను తిరస్కరించిన క్షణంలో రాజీనామా ఇవ్వగలదు, లేదా అసెంబ్లీ విశ్వాసాన్ని పొందడానికి ప్రయత్నించివుండేది. కానిమనమంత్రివర్గం అలాంటి పని ఏమీ చేయబోవడం లేదని ఆర్థిక, న్యాయశాఖా మంత్రి శ్రీ విశ్వనాథంగారు హామీ ఇచ్చారు. మంత్రుల జీతాల తగ్గింపువల్ల ప్రభుత్వ ఖర్చులో సాలుకు యాభై వేల రూపాయలు తగ్గిందని ఆర్థిక మంత్రిగా విశ్వనాథంగారు సంతోషించవచ్చును కాని మంత్రుల జీతాలకు సంబంధించిన ప్రతిపాదనపై అసెంబ్లీ ప్రభుత్వ కోరికలను అంగీకరించలేదంటే, అది మంత్రివర్గంపై అసెంబ్లీ అభిప్రాయాన్ని వ్యక్తం చేసిందని న్యాయశాఖామంత్రిగా శ్రీ విశ్వనాథంగారు గ్రహించియుండవలసింది. వారు తమ ప్రతిభను, పాండిత్యాన్ని ఈ సత్యాన్ని గ్రహించుటకు గాక తమ ప్రతిపాదనను నెగ్గించుకోలేక పోవడంలో బయట పడిపోయిన ప్రభుత్వ అసమర్థతను, ప్రభుత్వ సౌశీల్యానికి నిదర్శనంగా చిత్రించడానికి వినియోగించారు.

మంత్రులకు జీతాలు ప్రధానం కాదని, కనుకనే వారు తమ ప్రతిపాదనను నెగ్గించుకొనుటకు లొంగిపోయిపడలేదని వేదాంతం సూక్తాదారు శ్రీ విశ్వనాథంగారు. మంత్రులకు పదవులు తప్ప 'పణం' ప్రధానం కాకపోవచ్చు. అయితే మరి విశ్వనాథంగారు తమకై తామే జీతాలను ఎందుకు తగ్గించలేదో? మంత్రి కోటిరెడ్డిగారు ప్రస్తుత ఆర్థిక పరిస్థితులన్నన్నీ చూస్తే మంత్రుల జీతాలు అయిదువేల రూపాయలైనా వుండాలని అనుద్యప్రకటించిన సంగతిని విశ్వనాథంగారు విస్మరించారా?

ఈ తీర్మానాన్ని ప్రవేశపెడుతూ ఆయన మంత్రులకు జీతాలు చెల్లించేది జనవరి 1 నుంచే అని ఆర్థికమంత్రి సమాధానం ఇచ్చారు. అసెంబ్లీ మంత్రుల జీతం రు 500/- వుండాలని తీర్మానిస్తే, మంత్రులుగావున్నవారు మంత్రులైన నాటినుండి అదే జీతాన్ని తీసుకోవాలి. అది పరిష్కారపద్ధతి. అందుకు విశ్వనాథంగారు సిద్ధంగా లేరు. అయినా వారు మంత్రులకు జీతం ప్రధానం కాదని వాదించ కలుగుతూ వున్నారు.

మంత్రివర్గం రాజీనామా ఇవ్వాలని ఎవరూ కోరడం లేదు. మంత్రులు వెయ్యిరూపాయిలు గాక, అయిదువందల రూపాయలు మాత్రమే జీతం తీసుకోవాలనే వాదాన్ని మేము బలపరచడం లేదు. అక్టోబరు, నవంబరు మాసాలకు గవర్నరు ఆర్డినెన్సు ప్రకారం తీసుకున్న జీతాలనుంచి సగభాగం వెంటనే చెల్లించివేయాలని ఎవరూ పట్టుబట్టడం లేదు.

ఈ సంఘటనలో అత్యంత ఆక్షేపణీయమైనది శ్రీ విశ్వనాథంగారి వైఖరి. తమజీతాల క్లాజును నెగ్గించుకోనడానికి తాము అసెంబ్లీలో వోట్లను కాన్వాసు చేయలేదని, ప్రతిపక్షంవారు అట్టి కాన్వాసింగు చేసి తమ సవరణను నెగ్గించుకున్నారని విశ్వనాథంగారు ప్రతిపక్షంపై ఒక విసురు విసిరారు. రాజధాని ప్రతిపాదనను ఏదో విధంగా నెగ్గించుకోనడానికి చతుర్విధోపాయాలను ప్రయోగించిన ప్రభుత్వపక్షానికి ప్రతిపక్షాన్ని ఈ విధంగా - వోట్లు కాన్వాసింగు పక్షంగా - విమర్శించే అర్హత లేదు. మంత్రుల జీతాల క్లాజుపై పొందిన పరాజయం తమ పాతివ్రత్యాన్ని నిరూపిస్తున్నదని ప్రకటించ కలిగిన విశ్వనాథంగారి సాహసం ప్రశంసనీయం!

మంత్రులకు జీతాల విషయంలో పట్టింపు లేదనే శ్రీవిశ్వనాథంగారి ప్రకటనకు ఎంత విలువవున్నదో వారు 1954-55 ఆర్థిక సంవత్సరానికి తయారుచేసే ఆయవ్యయ అంచనాలే వెల్లడించగలవు.

భారత రాజ్యాంగంలోని 200 సెక్షను అనుసరించి గవర్నరు 'ఆర్థిక బిల్లు' కాని వాటిని పునర్విచారణ చేయమని కోరుతూ అసెంబ్లీకి తిరిగి పంపవచ్చును. ఆబిల్లులో జరుగవలసిన మార్పులను సూచింపవచ్చును. జీతాల విషయంలో పట్టింపు లేనందువల్ల మంత్రివర్గం గవర్నరుచే ఈ బిల్లును పునర్విచారణ నిమిత్తం అసెంబ్లీకి పంపదనే అనుకోవచ్చు. అయితే మంత్రుల జీతాలబిల్లు ఆర్థిక విషయికమైన బిల్లు అవునా కాదా అనేది ముందు నిర్ధారణ కావాలి. ఈ విషయాన్ని నిర్ధారించే అధికారం అసెంబ్లీ స్పీకరుకు మాత్రమే వుంది. కనుకమంత్రివర్గం తమ జీతాలను తిరిగి హెచ్చించుకోవడానికి ప్రయత్నిస్తారో లేదో తిరిగి ఆంధ్ర అసెంబ్లీ సమావేశమైననాటికి గాని తెలియదు. మంత్రివర్గం ఇట్టిపని చేయక తమజీతాలను అసెంబ్లీ నిర్ణయించిన ప్రకారం తీసుకోవడం వారికి, అసెంబ్లీకి రాష్ట్రానికి కూడా గౌరవంగా వుంటుంది.

### మంత్రి శ్రీ పట్టాభిరామారావు గారి పర్యటన

కర్నూలు, డిసెంబరు 1: విద్యామంత్రి శ్రీ పట్టాభిరామారావు డిసెంబరు 6-వ కర్నూలునుంచి బయలుదేరి కృష్ణాజిల్లాకు [illegible] మద్రాసు [illegible]. అక్కడనుంచి వారు 10-వ తేదీన బయలుదేరి 11-వ తేదీకి [illegible]. 13-వ తారీఖు నుంచి బయలుదేరి 15 తేదీకి కర్నూలు వస్తారు.

## వర్కింగ్ జర్నలిస్టుల పట్ల ప్రభుత్వ సానుభూతి

### కార్మికశాఖ మంత్రి శ్రీ వి. వి. గిరిహామీ

న్యూఢిల్లీ, డిసెంబరు 1: ఇతరులతో బాటు వర్కింగ్ జర్నలిస్టులకు కూడా ప్రభుత్వంవారు న్యాయం చేయ వాంఛిస్తున్నారని కార్మికశాఖ మంత్రి శ్రీ వి. వి. గిరి యీ వేళ ఇక్కడ ప్రకటించారు.

పారిశ్రామిక తగాదాల చట్టాన్ని వర్కింగ్ జర్నలిస్టులకుగూడా వర్తింపజేసే ఆర్డినెన్సును పార్లమెంటు సమావేశానికిపూర్వం ప్రభుత్వంవారుయెందుకు జారీచేయలేదని కౌన్సిల్ ఆఫ్ స్టేట్సులో జరిగిన సూచనకు సమాధానమిస్తూ కార్మికశాఖ మంత్రి పైవిధంగా ప్రకటించారు.

బెన్నెట్ కోల్ మెన్ కంపెనీ యజమానులకు పనివారికిమధ్య యేర్పడిన తగాదాపరిష్కారానికి నియమించబడిన ట్రిబ్యూనలు తమతాత్కాలిక నిర్ణయవాప్తినుండి వర్కింగ్ జర్నలిస్టులను మినహాయించిన సంగతి నిజమేనా? ఈ సందర్భమున వర్కింగ్ జర్నలిస్టులనుంచి వచ్చినవిజ్ఞప్తులపై ప్రభుత్వంవారు యేమిచర్య తీసుకున్నారు? అని ఎస్. ఎస్. ముజందారు ప్రశ్నించారు.

డిప్యూటీమంత్రి అబదాలీ యిలా సమాధాన మిచ్చారు: తాత్కాలిక అవార్డు ననుసరించి 1953 ఆగస్టు 31 న కంపెనీలో ఉద్యోగం చేస్తున్నవారందరు, పారిశ్రామిక తగాదాల చట్టము ననుసరించి కార్మికులుగా ఎంచబడేవారందరు తాత్కాలిక సహాయానికి అర్హులై వుంటారు.

దినకూలీలను, కార్మికులు కాని వారిని ట్రిబ్యూనలు తాము సూచించిన తాత్కాలిక సహాయమునుండి ప్రత్యేకంగా మినహాయించింది. వర్కింగ్ జర్నలిస్టులు కార్మికులవునా? కాదా అనే విషయమును ఎవార్డు స్పష్టీకరిస్తున్నట్లు కనిపించదు. ఈ ఎవార్డు మూలమున కలిగే లాభాలను ఉద్యోగులందరికీ, కార్మికులయినా సరే, కాకపోయినాసరే అందరికీ వర్తింపజేసే విషయమును కంపెనీ ఆలోచిస్తున్నదని ప్రభుత్వం వారికి తెలియజేయబడింది. చట్టమును సవరించే విషయమును భారతి ప్రభుత్వం వారు శ్రద్ధగా ఆలోచిస్తున్నారు."

శ్రీ గిరి మరొకప్రశ్నకు సమాధానమిస్తూ ఇలా అన్నారు: కలకత్తా హైకోర్టు ఆఫ్ ఇండియాకు సంబంధించిన ఈ విషయంలో ప్రభుత్వం వెంటనే చర్యలు తీసుకున్నది. ఈ విషయమును పత్రికొత్త కారులకు తెలియజేసింది. కార్మికులకుకలిగే లాభాలు వర్కింగ్ జర్నలిస్టులకుగూడా కలుగుతవని వారు వాగ్దానం చేశారు. ఈ విషయమును పత్రికొకమిషను వారుకూడా శ్రద్ధగా విచారిస్తున్నారు. కమిషను అభిప్రాయం కోసం వేచివున్నాము. ఐనప్పటికీ యితరులతోబాటు వర్కింగ్ జర్నలిస్టులకుగూడా న్యాయం చేయ ప్రభుత్వం గాఢంగా వాంఛిస్తున్నదని సభ వారికి హామీ యిస్తున్నాను."

### రైల్వేలలో ఫలాహార యేర్పాట్లు

రైల్వేలలో ఫలహార సరఫరా యేర్పాట్లను అభివృద్ధి చేసే విషయంలో రైల్వేవారు శ్రద్ధ వహిస్తున్నారని, త్వరలో అవసరమైన చర్య తీసుకుంటారని రైల్వేమంత్రి శ్రీ లాల్ బహాద్దూర్ శాస్త్రి కౌన్సిల్ ఆఫ్ స్టేట్సుకు తెలియజేశారు. ప్రయాణీకుల సలహా సంఘాలు ఈ విషయాన్ని చర్చించింది. సభవారి సలహాలను మేము శిరసావహిస్తాము" అని శాస్త్రిగారు ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ తెలిపారు.

## వనపర్తి ఉపఎన్నిక

### ప్రజాసోషలిస్టు అభ్యర్థి విజయం

హైదరాబాద్, డిసెంబరు 2: వనపర్తి నియోజకవర్గ ఉపఎన్నికలో ప్రజాసోషలిస్టు అభ్యర్థి ఎమ్. రామరెడ్డిగారు సంస్థాన శాసనసభకు ఎన్నుకోబడ్డారు. వీరిలో పోటీచేసిన కాంగ్రెసు అభ్యర్థి ఓడిపోయారు. శ్రీ సు. ప్రతాపరెడ్డిగారి మరణంవల్ల ఏర్పడిన ఈ ఖాళీకి నవంబరు 29 న ఎన్నిక జరిగింది.

శ్రీ రెడ్డిగారికి 9089 ఓట్లు, కాంగ్రెసు అభ్యర్థి జయరామ్‌గారికి 7425 ఓట్లు వచ్చాయి. ఉపసంహరణ పకాలంలో జరగని కొండాల మిగిలిన మరో కాంగ్రెసు అభ్యర్థి, దశరథయ్యగారికి 1133 ఓట్లు వచ్చాయి.

175 మంది శాసనసభ్యులు గల హైదరాబాద్ శాసనసభలో వివిధ పార్టీల బలాబలాలు ఇలా వున్నాయి. కాంగ్రెసు 92, పీపుల్సు డెమోక్రాటిక్ ఫ్రంటు 41, యునైటెడ్ పీపుల్సుపార్టీ 33, షెడ్యూల్డు తరగతుల ఫెడరేషను 5, స్వతంత్రులు ముగ్గురు.

మద్రాసు, డిసెంబరు 2: హైకోర్టు ప్రాంతాల్లో పానశాలల [illegible] (60), [illegible] (62), [illegible] నిన్న [illegible] పోలీసులు [illegible] అరెస్టు చేశారు.

## ఢిల్లీలో కొరియా రాజకీయ సభ

### ఇండియాకు అభ్యంతరం లేదని అభిజ్ఞ వర్గాల సూచన

న్యూఢిల్లీ, డిసెంబరు 1: కొరియా రాజకీయ సమావేశం ఢిల్లీలో జరగాలన్న ఆరాటం ఇండియాకేమీ లేదు కాని, ఉభయపక్షాలు దానిని కోరితే దానికి అభ్యంతరమేమీ ఉండదని ఇక్కడి అభిజ్ఞవర్గాలు నేడు సూచించారు. అసలు ప్రధాన విషయం సమావేశం జరగటమే కాని, ఎక్కడ జరగటం అన్నదికాదని ఇండియా అభిప్రాయపడుతున్నట్లు వారు సూచించారు.

ఈ విషయమై జులైలో పండిత నెహ్రూ చెప్పిన ఈ అంశం ఉదహరించబడుతున్నది. "ఢిల్లీలో కొరియా రాజకీయ సమావేశం జరపటానికి మేము సిద్ధంగా ఉన్నాము. దానికి ఒప్పుకోవలసింది ఉభయ పక్షాలు మాత్రమే అసలు ఆ సమావేశం యెక్కడ జరిగినా మాకు సంతోషమే" అని నెహ్రూ అన్నారు.

ఈ విషయంలో భారతి ప్రభుత్వ వైఖరిలో ఏమీ మార్పు రాలేదని తెలుస్తున్నది.

## హైద్రాబాద్ అసెంబ్లీ

### అనధికార తీర్మానాలపై బ్యాలెట్ నిర్ణయాలు

హైదరాబాద్, డిసెంబరు 1: హైదరాబాద్ 'పోలీసుచర్య' అనంతరం ఆస్తులను స్వాధీనపర్చుకున్న వారికి తిరిగి ఇచ్చివేయాలనే దాజీ శంకరరావుగారి తీర్మానానికి శీతకాలపు సంస్థాన శాసనసభ అనధికార తీర్మానాలలో ఇవాళ బ్యాలట్‌లో ప్రథమ స్థానం లభించింది.

పదిహేడుమంది శాసనసభ్యులు అందజేసిన సలభైఅనధికార తీర్మానాలను స్పీకర్ అంగీకరించారు. అనధికార తీర్మానాల చర్చకు ఒకరోజు ప్రత్యేకించారు.

పెరిగేశ్వరలు అరికట్టాలన్న బుచ్చయ్యగారి తీర్మానానికి రెండవ స్థానం లభించింది.

పీపుల్సు డెమోక్రాటిక్ ఫ్రంటు కార్యదర్శి జి. హనుమంతరావుగారు పంపిన హైదరాబాద్ రాజ్ ప్రముఖ్ కు 'ప్రత్యేకధిరణం' అపుచేయాలనే తీర్మానానికి మూడవ స్థానం వచ్చింది.

శీతకాలపు సమావేశంలో చర్చకు రానున్న అనధికార తీర్మానాలలో గ్రామాధికారుల వారసత్వరద్దు, మంత్రుల శాసనసభ్యుల స్థిరచరాస్తుల విలువ నిర్ణయం, రాజ్ ప్రముఖ్ పద్ధతి రద్దు, సంస్థానంలో నిరుద్యోగసమస్య పరిష్కారం అతిముఖ్యమైనవి.

## హైద్రాబాద్‌లో ధాన్యం నిల్వలు.

సికింద్రాబాద్, డిసెంబరు 1:— ఇంతవరకు నిల్వయున్న 25,000 టన్నులకుతోడు, మరో 60,000టన్నుల జొన్నలు అదనంగా నిల్వచేయటం జరిగిందని సంస్థాన సరఫరామంత్రి డాక్టరు ఎం. చెన్నారెడ్డిగారు ఇవాళ వెల్లడించారు.

ఈ అదనపు నిల్వలను కేంద్రప్రభుత్వ స్వాధీనంలో ఉంచామని పత్రికా ప్రతినిధులకు తెలియజేశారు.

సంస్థానంలో పంట తృప్తికరంగానే ఉన్నదనీ, బియ్యంగూడాపుష్కలంగా లభించగలవని ఆశిస్తున్నామనీ, రాని పంట రాగానే 1954 ఫిబ్రవరి తర్వాత ఆహారపరిస్థితినిగురించి తెలుసుకోటానికివీలవుతుందనీవివరించారు.

## "దృక్పథం మారాలి"

### పార్లమెంటు కాంగ్రెసు సభ్యులకు ప్రధాని నెహ్రూ ఉద్బోధ

న్యూఢిల్లీ, డిశంబరు 1: సాంఘిక ఆర్థిక సమస్యలను నూతన దృక్పథంతో విచారించాలనీ విధినిర్ణయమంటూ యేమీ లేదనీ ప్రధాని పండిత నెహ్రూ పార్లమెంటుసభ్యులనుఉద్బోధించారు.

గత వారం ప్రధాని కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీలో చేసిన కొన్ని భాగాలు ప్రచురణకాలేదు. ఆభాగాలను కాంగ్రెసు పక్ష 'పత్రిక' ఎకనమిక్ రివ్యూ ప్రచురించింది. ప్రధాని ప్రపంచంలో యిప్పుడు జరుగుతున్న పారిశ్రామిక విప్లవం విషయమై ప్రస్తావించి ఇలా చెప్పారు: ప్రపంచంలో జరుగుతున్న తీవ్ర మార్పులను మనం గుర్తించాలి. కుటీర పరిశ్రమలు గ్రామపరిశ్రమలు ప్రయోజనకారులు కావనీ, చరఖా మగ్గాలను మధ్యయుగాలకు తీసుకుపోయిందని పారిశ్రామికులు అంటున్నారు. వారు చెప్పినదాంట్లో కొంత నిజంలేకపోలేదు. కాని పారిశ్రామికుల దృక్పథం యెన్నటికీ మారనిదిగా వున్నది. యంత్రమే సారివారి [illegible] గ్రహించడం లేదు. [illegible] నుంచి శక్తిని ఉత్పత్తిచేయడంవల్ల పారిశ్రామిక విప్లవంవచ్చింది. పరిశ్రమలు పట్టణాల్లో కేంద్రీకృతం కావడానికి అది కారణభూతమైంది. విద్యుచ్ఛక్తి మూలమున పరిశ్రమలను గ్రామాల్లో స్థాపించడం సాధ్యమైంది. అణుశక్తి మూలమున 10, 15 ఏళ్ళలో పెద్ద [illegible] మార్పులు జరుగబోతున్నాయి [illegible] పరిశ్రమలను గ్రామాల్లో వికేంద్రీకృతం చేయడానికి అది తోడ్పడుతుంది."

## గాయకమూర్తి-భక్తాగ్రేసరుడు త్యాగయ్య

### శ్రీ విస్సా అప్పారావుగారి ప్రశంస

రాజమండ్రి, నవంబరు 30: గాయకబ్రహ్మ శ్రీ త్యాగరాజు జీవిత విశేషాలను, వారి రచనావిశేష, పదములుదురుకు, అందలి సంగీతమాధుర్యము, శాస్త్రీయపరిశోధన ఫలితంగా వెలువడుతూ వున్న అద్వితీయ పరిశోధ, నిన్న సాయంత్రము శ్రీ గౌతమీ గ్రంథాలయావరణంలో బాబాయమ్మ హాలులో జరిగిన సభలో శ్రీ విస్సా అప్పారావుగారు విపులీకరించారు.

ఆంధ్ర గానకళాపరిషత్తు (రిజిస్టర్డు) కార్యదర్శులు శ్రీయుతులు దేవత రామమోహనరావు, ఓలేటి జగన్నాథాచార్యులుగారలు గౌతమీ గ్రంథాలయ అధ్యక్ష కార్యదర్శులు శ్రీ వాడ్రేవు బాపిరాజు, తే వెంకటరామశంకరం గారలూ ఈ సభను యేర్పాటుచేయించారు.

శ్రీ అప్పారావుగారి ఉపన్యాసమునకు ముందు శ్రీమతి వల్లూరి చక్రవర్తుల భానుమతి గారిచే (గాత్రము) గానసభ జరుపబడెను. శ్రీ చల్లా కృష్ణమూర్తి (వాయులీనము) శ్రీ వారణాశి యజ్ఞనారాయణశాస్త్రి (మృదంగం) సహవాద్యము చేశారు.

గానసభనూ, శ్రీ అప్పారావుగారి ఉపన్యాసమునూ విద్యావంతులైన ప్రేక్షకులు పరువురు మెచ్చుకున్నారు. (స్వ. వి.)

## ప్రజాసోషలిస్టు పార్టీ రాష్ట్ర కార్యవర్గం

### ఈనెల 13 న విజయవాడలో సమావేశం

విజయవాడ, డిసెంబరు 2: ఆంధ్ర రాష్ట్ర ప్రజాసోషలిస్టుపార్టీ కార్యవర్గం ఈనెల 13వ ఇక్కడ సమావేశం కానున్నది. జాతీయ రాష్ట్ర కార్యవర్గాలు చేసిన తీర్మానాలను, ఆంధ్ర ప్రభుత్వం పట్ల ఆంధ్రరాష్ట్ర ప్రజాసోషలిస్టుపార్టీ అవలంబించవలసిన వైఖరిని గురించి శ్రీ జె. బి. కృపలానీగారు చేసిన స్పష్టీకరణకూ కట్టుబడి వుండవలసిందిగా రాష్ట్రపార్టీ సభ్యులందరికీ ఆనాటి సమావేశంలో ఆదేశమివ్వబడ గలదనుకొంటున్నారు.

అలహాబాదులో జరుగనున్న అఖిల భారత ప్రజాసోషలిస్టుపార్టీ మహాసభకు ఆంధ్ర నుంచి పంపించవలసిన ప్రతినిధుల నిర్ణయం, వచ్చే జనవరిలో పశ్చిమ గోదావరిజిల్లా తణుకులో జరుగనున్న రాష్ట్ర మహాసభల కార్యక్రమం మొదలైన సమస్యలను ఈనెల 13 న ఇక్కడ జరిగే రాష్ట్ర పార్టీ కార్యవర్గ సమావేశంలో పరిశీలిస్తారు.

శ్రీ అశోక్ మెహతా అరెస్టు సందర్భంలో ఈనెల 12 న "నిరసన దినం" జరపవలసిందిగా పార్టీ సభ్యులందరికీ రాష్ట్ర పార్టీ కార్యదర్శి పి. వి. జి. రాజుగారు విజ్ఞప్తి చేశారు.

## కిరసనాయిల్, మోటార్ నూనెల ధర తగ్గింపు

న్యూఢిల్లీ, డిసెంబరు 1: పెట్రోలియమునుంచి తయారుచేసే కొన్ని నూనెల ధరలు తగ్గిస్తున్నట్లు ఈ వేళ ప్రభుత్వంవారు ప్రకటించారు. ఈ తగ్గింపులు డిసెంబరు 2 నుంచి అమలులోనికి వస్తవి.

దిగ్గర దేశాలనుంచి ఈ నూనెలు పుష్కలంగా లభ్యమవుతూ వుండడం వల్లను రవాణాఛార్జీలు తగ్గడంవల్లను ధరలు తగ్గించడం సాధ్యమైంది.

తగ్గింపులు ఈ క్రింది విధంగా వున్నాయి.

కిరసనాయిలు 8 గాలన్ల డబ్బాకు 0-6-6 నుంచి 9 అణాల వరకు.

మోటార్ స్పిరిట్: విశాఖపట్నం, కలకత్తాలనుండి సరఫరాఅయ్యే ప్రాంతాలలో గాలనుకు అర్ధణా.

వేపొరైసింగ్ ఆయిల్: గాలనుకు కాని.

హై స్పీడ్ డయిసెల్ అయిలు: గాలనుకు ఒకఅణానుండి 0-1-3 వరకు.

లైట్ డైసెల్ అయిలు: టన్నుకు రూ 3-0-0 నుండి 4-7-0 వరకు.

ఫర్నేస్ ఆయిల్: టన్నుకు రూ 3/11/-నుంచి రూ 6-2-0 వరకు.

## గానసభలకు పన్ను మినహాయింపు

(ఆంధ్రపత్రిక విలేఖరి)

కర్నూలు, డిసెంబరు 1: ప్రభుత్వ నిబంధనలప్రకారం సక్రమంగానెలవిగా గుర్తించబడిన (రిజిష్టర్డు) సంగీతసభలు, అటువంటి మరి ఇతర సంఘాలన్నీ ఏర్పాటుచేసే సంగీత కాలక్షేపాలు, నాట్య సంగీతాలున్న వినోద కాలక్షేపాల వంటివాటిని ఎన్టర్‌టైజమెంట్ పన్నునుంచి 1951 నవంబరునుంచి రెండు సంవత్సరాలపాటు లోగడ అమలు జరుపబడిన ఈ తీరువులను 1953 నవంబరు మొదటి తేదీనుంచి మరోసంవత్సరం పొడిగించుతూ ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం నేడొక ఉత్తరువు ప్రకటించింది.

ఇంకా మరికొంతకాలం ఈ మినహాయింపు అమలులో వుంచాలని యేర్పాటు చేయించవలసిందిగా అనేక సంఘాలవారు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసినందున ఇప్పుడీ ఉత్తరువు ఇవ్వబడినది.

## గయానా నాయకుడు నజ్రుద్దీన్‌పై రాజద్రోహ విచారణ

### ప్రాసిక్యూషన్ ఆరోపణలు

జార్జిటౌన్, డిశంబరు 1: పి పి పి నాయకులలో ఒకరైన ఫ్రెడ్ బౌమన్ను, కోశాధికారి అయిన నజ్రుద్దీన్ను గయానా ప్రభుత్వం పెట్టిన్చటు రాజద్రోహ నేరంకై విచారణ జరపడం ప్రారంభించింది.

అందులో బౌమన్ అనేఅయన తెల్లవాళ్ళని దూషిస్తూ ఉపన్యాసాలివ్వడం, వారు తక్కినవారిని బానిసల క్రింద చూస్తున్నారనడం, ఈ వైఖరిని తక్కిన జాతులవారికి అవమానకరంగా వుంది గాబట్టి, దక్షిణ్యం భారం సోషిఅయినా, అట్టి వాళ్ళని ఎదుర్కొంటూ రనడం, తెల్లవారితో పోరాటం వస్తుందిగాబట్టి అంతా ఐక్యం కావాలని కోరడం, మొదలైన పనులు చేసాడని, అవి రాజద్రోహం క్రిందకు వచ్చే నేరాలని, అయనమీద ఆరోపణలు చేసారు.

నజ్రుద్దీన్ ఈ తెల్లవాళ్ళు కార్మికులను హీనంగా చూస్తున్నారని, అందువల్ల కార్మికులు దౌర్జన్యానికి దిగవలసిన సమయం రావచ్చునని అన్నాడని అందు చేత అంతా ఐకమత్యంతో పని చేయాలని, రాణిగారున్నారే, ఆమె సామ్రాజ్యవాదానికి ఒక చిహ్నం తప్ప అంతకన్నా ఏమీ లేదని ఈ వలసలో వున్న పెట్టుబడిదార్లంతా ఆమె బంటులని అన్నాడని, అది రాజద్రోహంఅని ఈయనమీద నేరాన్ని ఆరోపించారు.

ఈ విచారణ కొంతకాలం విలకించడానికి వచ్చిన జనంతో కోర్టు కిటకిటగా వుంది.

### కెన్యాలో 44 మంది కైకుయుల శిక్షల రద్దు

ఒక 88 మంది కైకుయు ఆఫ్రికన్ల మీద నానావిధాలయిన ఆరోపణలు చేసి శిక్షలువిధించగా, తూర్పు ఆఫ్రికా అప్పీలుకోర్టు నేడు అందులో 44 మందిమీద ఈ కోర్టులు విధించిన శిక్షలను రద్దుచేసింది. వీరందరికి ఆ క్రింది కోర్టులు మరణశిక్షలు విధించాయి. అయితే, ఈ88లో13మందిని అదివరకే, అప్పీలుకు అవకాశం ఇవ్వకుండా నే ఉరితీసింది. ఈ 44 మంది ఉరితీయడానికి అయిన వయస్సురాని వాళ్లు కొబట్టి అప్పటికే ఉరితీయకుండా వదిలింది. వాళ్లు అప్పీలు చేసుకోగా, అప్పీలు కోర్టు వాడు క్రిందికోర్టులో ప్రాసిక్యూషన్ తెచ్చిన సాక్ష్యం నమ్మేందుకు వీలులేకుండా వున్నదని, అందువల్ల ఆ శిక్షలను రద్దు చేస్తున్నామని తీర్పు ఇచ్చారు. అయితే వీరిని నిర్బంధంలో వుంచాలన్నారు.

### కెన్యాటా అప్పీలు విచారణ ప్రారంభం

కెన్యా ఆఫ్రికన్ నాయకుడు జోమో కెన్యాటా, మరి 5 గురు ఆఫ్రికన్లు తూర్పుఆఫ్రికా అప్పీలుకోర్టు తీర్పును గూర్చి చేసుకొన్న అప్పీలు విచారణ నేడు కితాలేలో ప్రారంభమైంది. వీరికి మావ్ మావ్ తో సంబంధం వున్నదని ప్రత్యేక న్యాయస్థానాన్ని ఒకదాన్ని ఏర్పాటుచేసి, విచారణ జరిపించి, 7 సంవత్సరాలు కఠినశిక్ష విధించారు. అయితే ఆ తీర్పును కెన్యా సుప్రీంకోర్టు రద్దు చేసింది. తూర్పు ఆఫ్రికా అప్పీలుకోర్టు సుప్రీంకోర్టు తీర్పునురద్దుచేసి మొదటిశిక్షనుఖాయం చేసింది. ప్రీవీ కౌన్సిల్ వారు వీరి అప్పీలును గ్రహించడానికి నిరాకరించారు. అందువల్ల అప్పీలు విచారణ ఇచ్చటే జరుగుతోంది. డి. ఎన్. ప్రిట్ వీరితరఫున న్యాయవాదిగా పని చేస్తున్నారు.

### గ్రిఫిత్సుకోర్టు మార్షల్

కెన్యాలో నానా దుర్మార్గాలు చేసిన బ్రిటిష్ సైనికాధికారి కెప్టెన్ గ్రిఫిత్సుకోర్టు మార్షల్ వివరాలను గూర్చి ఒక ప్రకటన చేయవలసిందిగా బ్రిటిష్ పార్లమెంటు ప్రభువులసభలో కార్మికపక్షంవారు ప్రభుత్వాన్ని కోరారు. వీరి ఈకోర్కెను వలసలమంత్రి లిటిల్ టన్‌కు అందజేస్తానని ప్రభుత్వ పక్షం ప్రతినిధి సమాధానం ఇచ్చారు.

## న్యాయ, పరిపాలనా నిర్వహణ శాఖల విభజన

### మరో జిల్లాల్లో అమలుజరపాలని ఆంధ్రప్రభుత్వ నిర్ణయం

కర్నూలు, డిశంబరు 1: 1954 ఏప్రిల్ మొదటి తేదీ నుంచి పశ్చిమ గోదావరిజిల్లాలో న్యాయ, పరిపాలనా నిర్వహణ శాఖలను విడదీసే కార్యక్రమం అమలుజరపాలని ఆంధ్ర ప్రభుత్వం నిర్ణయించినట్లు నేడు ఇక్కడ వెలువడిన ప్రభుత్వ ప్రకటన తెలుపుతున్నది.

ప్రస్తుతం ఈ ప్రణాళిక మూడు జిల్లాలలో అమలులో వున్నది. మరి [illegible] జిల్లాలలో జిల్లాకోర్టుమున్సబులే సబ్ డివిజనల్ మేజస్ట్రేట్లుగా కూడా పనిచేస్తున్నారు.

## బుగాండా రాజు పదవీచ్యుతి వైనం

### లండనులో ఖైదీగా వుంచే సూచన

కంపాలా, డిశంబరు 1: బుగాండా రాజప్రధాని పాలో కవ్యాలా నేడు ఆఫ్రికన్ సదస్సులో రాజును బ్రిటిష్ వాళ్లు పదవీచ్యుతుణ్ణి చెయ్యడాన్ని గురించి మాట్లాడుతూ, వారు ఆయన్ను బ్రిటనులో ఖైదీగా వుంచుతున్నారని, ప్రజలంతా ఈ సందర్భంలో శాంతంగా వ్యవహరించవలసివున్నదని తెలియజేశారు.

బ్రిటిష్‌వారికి, తమరాజుకు వచ్చిన తగాదాను గురించి ఈయన ఈ ప్రజను వివరించి చెప్పారు. మనం అంతా సదస్సులో స్వయంపాలనాన్ని కోరుతూ తీర్మానించివున్న సంగతి మీకు తెలిసిందే. ఆతర్వాత ఉగాండా గవర్నరు రాజుగారిని పిలిచి, ఆతీర్మానాన్ని ఖండించవలసిందని కోరాడు. రాజుగారు అందుకు నిరాకరించారు. అప్పుడు ఆ గవర్నరు మనరాజుగారు బ్రిటనుతో మనం చేసుకున్న ఒప్పందాలను భిగ్నం చేస్తున్నట్లు ప్రకటించారు. అంతేగాక, రాజపదవినుంచి ఆయన్ను తొలగిస్తున్నట్లు గూడా ఒక ఉత్తరాన్ని ఇచ్చారు. ఆతర్వాత పోలీసు కమిషనరు ఆయన్ను అరెస్టు చేసి, అచ్చటనే అట్టేపెట్టి వుంచిన విమానంలో ఎచ్చటికో తీసుకుపోయారు. ఇట్లు అరెస్టుచేసిన మనరాజును ఈఉగాండా అధికారులు లండన్‌కు తీసుకుపోయినట్లు వ్యక్తం అవుతున్నది. అక్కడ ఆయన్ను ఖైదీగా వుంచుతారల్లేవుంది.

ఈ విషయాల నన్నింటిని చెప్పి ఇంకో కొత్త సదస్సును ఏర్పాటుచేయడం దానిలో విశ్వాసాన్ని వుంచడం మీకు ఇష్టమా అని ఆ ప్రధాని ప్రశ్నించారు. మాకు ఈ సదస్సే కావాలని అంతా సమాధానం చెప్పారు.

ఉగాండా రాజు కబాకా ముత్సీయాను ఇంగ్లీషువాళ్లు అధికారంలోంచి తొలగించడం అరెస్టుచేయడం ఆదిగాగల వార్తలన్నీ తనకు చేరగానే ఆయన అక్కగారు వవిన్యాఅల్ వంగో దుఃఖ నివశురాలై ప్రాణాలువిడిచింది. ఇక ఈ ప్రాంతంలో గలంతులేమన్నా ప్రారంభమవుతాయోనని ఉగాండా గవర్నరు ఇచ్చటికి తెలపోలీసులను పంపించారు. అవసరమైతే ఉపయోగించడానికి పిస్తోలు బలాలను గూడా సన్నద్ధంచేసి వుంచుతున్నారు.

## గత యుద్ధంలో రష్యా పట్టుకున్న ఖైదీలు

న్యూయార్క్, డిసెంబర్ 1: గత యుద్ధంలో తాము పట్టుకుని ఇంకా తమ అధీనంలో ఉంచుకున్న యుద్ధఖైదీల పూర్తి వివరాలను రష్యన్ నాయకులు తెలియజేసి, తద్వారా, ప్రపంచ వైరుధ్యాలను సడలించాలని తాము నిజంగా కోరుతున్నట్లు ప్రపంచానికి నిరూపించాలని సమితి ప్రత్యేక కమిటీలో అమెరికా ప్రతినిధి జేమ్స్ బైర్న్స్ సూచించారు.

ఈ కమిటీ ఆమాకే తెలియకుండా పోయిన యుద్ధఖైదీల సమస్యను పరిశీలిస్తున్నది.

రష్యాలో అధికారంలోకి వచ్చిన కొత్తనాయకులు ఈ పని తప్పకుండా చేయాలని ఆయన అన్నారు.

కొరియా యుద్ధ ఖైదీలమీదనూ, పౌరులమీదనూ కమ్యూనిస్టులు అత్యాచారాలు జరిపినట్లు అమెరికా చేసిన ఆరోపణలు కేవలం అభూతకల్పనలని సోవియట్ ప్రతినిధి విషిన్‌స్కీ నేడు సమితి సర్వసభ్య సభలో వాదించారు.

### శ్రీ వివేకానందమూర్తి పదవీ స్వీకరణ

కర్నూలు, డిసెంబరు 2: ఆంధ్ర పబ్లిక్ సర్వీస్ కమీషన్ ఛైర్మన్ సి. వివేకానందమూర్తిగారు ఇవాళ ఇక్కడనుంచి రైలులో బయలుదేరి మదరాసు వెళ్ళారు.

ఇక్కడవుండగా ముఖ్యమంత్రి టి. ప్రకాశంగారిని, ఇతరులను కలుసుకున్నారు. రేపు మదరాసులో పదవిని స్వీకరిస్తారు.

సర్వీసెస్సు కమీషనులో సభ్యులుగా నియామకమైన న్యాయశాఖా కార్యదర్శి ఎమ్. ఎ. వెంకటరమణ నాయుడుగారు రేపు మదరాసు వెడతారు.

## ఉద్యోగ వార్తలు

కర్నూలు, డిసెంబరు 2: గుంటూరుజిల్లా మేజిస్ట్రేట్ ఎ. కృష్ణస్వామిగారిని కడపజిల్లా అడిషనల్ మేజిస్ట్రేట్ (స్వతంత్ర) గానియమించారు. పి. సి. జేమ్సుగారిని హోంశాఖా డిప్యూటీ కార్యదర్శి (అంతరంగిక) గా నియమించారు.

ఎస్. ఎ. అయ్యంగార్ రేపటి నుంచి రాగానే ట్రాన్సుపోర్టు కమీషనర్ గా పనిచేస్తారు. ట్రాన్సుపోర్టు కమీషనర్ పి. పి. ఐ. వైద్యనాథన్ గారిని కృష్ణాజిల్లా కలెక్టరుగా నియమించారు.

ఇంతవరకు మెడికల్ సర్వీసెసు డైరక్టరే ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ జైళ్ళును కూడా నిర్వహిస్తున్నారు. ఇకనుంచి ఎస్. ఎ. అయ్యంగార్ రెండు పదవులను నిర్వహిస్తారు. ట్రాన్సుపోర్టు కమీషనర్, జైళ్ల ఇన్స్పెక్టర్ జనరల్ గా వ్యవహరిస్తారు.

## సంపాదకునకు లేఖలు

### భూమి సంస్కరణల తీరు

అర్యా, పంచవర్ష ప్రణాళికలో భూమి సంస్కరణలు ఒకభాగం. పంటలు ఎక్కువగాపండడం, ఆర్థికాభివృద్ధి సాధన ఈ ప్రణాళికయొక్క ఆశయాలు. ప్రజాస్వామిక ప్రభుత్వంలో ఆర్థిక సమానత్వం సాధించడానికి భూమిసంస్కరణ లొకభాగమని కొందరు భావించుచున్నారు. అయితే ఏది ప్రజాస్వామికం అనే విషయంలో విభిన్నపార్టీలమధ్య విభిన్నాభిప్రాయాలున్నాయి.

భూమిసంస్కరణలు అమలుజరిపి కర్షకులయొక్క శ్రేయస్సు అభివృద్ధిపరిచే ఉత్పత్తి ఎక్కువకాగలదని పార్టీలు నినాదాలు చేస్తున్నాయి. కాని మధ్యతరగతినిగురించి ఏ పార్టీకూడా ఆలోచించడంలేదు. కార్మిక కర్షకుల తరువాత మధ్యతరగతివారు అధిక సంఖ్యాకులు. మనదేశంలో పరిశ్రమలు అభివృద్ధి కాకపోవడంవల్ల ఎక్కువమంది భూమిమీద ఆధారపడి జీవనం సాగిస్తున్నారు.

ఇట్టి సమస్యలను కేవలం కర్షకులనేగాక మధ్యతరగతి ప్రజలనుకూడా దృష్టిలో పెట్టుకొని పరిశీలించాలి. ఒకో కొన్ని వర్గాలవారికి మాత్రమే మేలుకలిగించి ఇతరులను బాధపెట్టరాదు. అధికారంలో వున్నపార్టీ ఇతర పార్టీల నణచడానికి ఈ సంస్కరణలను సాధనంగా వినియోగించుకొంటే అసలుసమస్య పరిష్కారంకాకపోగా కొత్త సమస్య ఉత్పన్నంకావచ్చు. నీటిపారుదల సౌకర్యాలు ఎక్కువచేసి వ్యవసాయశాఖోద్యోగులకు రైతులకు మధ్య సహకారం పెంపొందించితే పంటలు ఎక్కువపండగలవు. భూదానోద్యమం, ఎస్టేట్ డ్యూటీచట్టం మొదలైన ఇతర మార్గాలద్వారా ఆర్థిక అసమానత్వం తొలగించవచ్చు.

రాజమండ్రి. కె. సి. కృష్ణమాచారి.

* * *

### ధాన్యంధరలు పడిపోకుండా చర్యతీసుకోవాలి

అర్యా, ధాన్యంధర రోజురోజుకి పడిపోతుంది. అక్కడక్కడ కొత్తవి రు. 16/-లు పాతవి రు 22/-లు అమ్ముతున్నవి. ధరలు యీ విధముగా పడిపోవడం రైతాంగంలో తీవ్రఆలజడిని కలిగిస్తోంది. సహజముగ డిశంబరు, జనవరి నెలలలో ధాన్యం మార్కెట్టుకు ఎక్కువగావస్తుంది. ఇప్పుడే ధర యీ విధముగా యుంటే వచ్చే రెండునెలలలోను ఏమవుతుందోయని రైతాంగం కంగారుపడుతున్నారు.

చిన్న రైతులు, కవులుదార్లు, సంవత్సరంపాడుగునా వ్యవసాయ పెట్టుబడులకు, కుటుంబ నిర్వహణకు తెచ్చిన అప్పులు ఎట్లాతీరతాయని ఆందోళన పడుతున్నారు. ఒకటిరెండునెలల క్రితం బస్తాధాన్యం రు 30/-లు చేసి అప్పులు తెచ్చిన పేదరైతాంగం యీ రోజు ధరప్రకారం బస్తాకు రెండు బస్తాలుచొప్పున ఇచ్చుకోవలసిన పరిస్థితిలోపడ్డారు.

చిన్న రైతులు అమ్ముకోవలసిన యీ తరుణంలో ధరలు పడిపోవడం, భూస్వాములకు, మిలుయజమానులకు అధిక ధరలు రావడం మామూలు విషయమే.

మార్కెట్టులో కొత్తబియ్యం 246 సౌనులుబస్తా రు 40/-లు, పాతబియ్యం రు 64/-లు వర్తకులు అమ్ముతున్నారు. యీ రేటుప్రకారంకూడా రైతుకు కొత్తధాన్యానికి రు 18/-లు పాతధాన్యమునకు రు 24/-లు యివ్వవచ్చు. కాని వ్యాపారులు కట్టుకట్టి ధరలు తగ్గించడమే యీవిధముగా ధరలు పడిపోవడానికికారణం. చిన్నరైతాంగం సంవత్సరముపొడుపునా చేసినఅప్పులు తీరకపోతే పరపతి నశిస్తుందనే భయముతో అయినకాటుకు అమ్మక తప్పటంలేదు. యీవిధముగా రైతాంగం విపరీతనష్టాలకు గురియగుతున్నారు.

ప్రభుత్వం వెంటనే కలిగించి ధాన్యానికి కనీసరేటు నిర్ణయించకపోతే రైతాంగం ఆర్థికముగా చితికిపోయే ప్రమాదమేర్పడుతుంది. అందుచే ప్రభుత్వం వెంటనే ధాన్యానికి కనీస రేటు నిర్ణయించాలి:

వెంటనే రైతాంగం కదలి గ్రామగ్రామమున సభలు పెటితీర్మానాలు చేసి ప్రభుత్వానికి పంపించాలి. మహాజర్లు పెట్టాలి. ప్రభుత్వానికి డాయబాగాల ద్వారా కనీసరేటు నిర్ణయించాలని తెలియపరచాలి. రైతాంగం సకలముగా కదలి యీ ప్రమాదాన్ని ఎదుర్కొవలసినదిగా కోరుచున్నాము.

అన్నె వంకటేశ్వరరావు, (కార్యదర్శి) ప. గో. జిల్లా రైతుసంఘం.
సంకు అప్పారావు, (కార్యదర్శి) జిల్లా కమ్యూనిస్టుకమిటీ.

## వినుకొండ తాలూకా పంచాయతీలలో పన్నుల వసూలు

### నాయుడుకు విజ్ఞప్తి

('ఆంధ్రపత్రిక' విలేఖరి)

కర్నూలు, నవంబరు 29: వినుకొండ తాలూకాలో క్షామప్రాంతంగా ప్రభుత్వం ప్రకటించిన 48 మేజరు పంచాయతీలలో 1952-53 సంవత్సరం తాలూకు ఇంటిపన్ను, వాహనముల పన్నును మాఫీ చేయగోరుతూ నల్లపల్లి వెంకటసుబ్బారావు, కృషికార్ లోక్ పార్టీ కార్యదర్శి యుల్ల మంద [illegible] రావు, వినుకొండ [illegible] సంఘం అధ్యక్షుడు శ్రీ [illegible] స్థానిక పాలనమంత్రి శ్రీ పిడతల రంగారెడ్డికి ఒక విజ్ఞప్తిని సమర్పించారు.

## ఇండొనేషియాతో ఆంధ్రుల చిరకాల సంస్కృతీసంబంధాలు

### కృష్ణశర్మగారికి వీడ్కోలు సభలో ప్రముఖుల ప్రసంగాలు

మదరాసు, డిశం 2: శ్రీ జేశిరాజు కృష్ణశర్మగారు (అప్పికట్ల గుంటూరు) ఇండొనేషియా దూర్యప్రాచ్య దేశాలకు అక్కడ వాణిజ్య సాంస్కృతిక సంబంధాలను ఏర్పరచుకోడానికి వెళ్తున్న సందర్భాన ఆంధ్ర విజ్ఞాన సమితివారు నిన్న సాయంత్రం రాయపేట వెస్టుకాట్ రోడులో సమితి భవనంలో వీడ్కోలుసభ, విందు జరిపారు.

సమితి కార్యదర్శి శ్రీ కే. శ్రీరామమూర్తిగారు సభికులకు స్వాగతం చెప్పారు.

శ్రీ దివులపల్లి కృష్ణశాస్త్రిగారు సభకు అధ్యక్షతవహిస్తూ, యాత్రలవల్ల విశేషప్రయోజనం వున్నదనీ, మన పూర్వీకులు కాశీ మొదలైన పుణ్యక్షేత్రాలకు అందుచేతనే యాత్రలు చేశారనీ, అదేవిధంగా ఇప్పటి ... యితర దేశాలకు వెళ్ళడంవల్ల ఆ దేశాలతో వర్తక సాంస్కృతిక సంబంధాలు చేకూరటానికి అవకాశం కలుగగలదనీ అన్నారు. శ్రీ కృష్ణశర్మగారు సురక్షితముగా వెళ్ళి ఘనముగా తిరిగి రాగలరని ఆశిస్తున్నామన్నారు.

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఇండియాకు దూరప్రాచ్యదేశాలకు అనాదిగా వర్తకవ్యాపార సంబంధాలే గాక, సాంస్కృతిక సంబంధాలు కూడా ఉంటూ వచ్చినవనీ ఆ దేశాలలో ముఖ్యంగా ఆంధ్రులు వర్తకం సాగించి వారి నాగరికత, కళలు ఆ దేశాలలో వ్యాపింప చేశారనీ ...



అమెరికా ఉపాధ్యక్షుడు రిచర్డ్ యం. నిక్సన్ డిశంబర్ 1 వ తేదీం న్యూఢిల్లీలో భారతప్రభుత్వ ఉపాధ్యక్షుడు డాక్టర్ రాధాకృష్ణన్ను సందర్శించారు

## హోచిమిన్ సూచనలపై జవాబు నాస్తి

### — వీట్నాం పత్రికలలో సెన్సార్

సైగాన్, డిశంబరు 1: ఇండొచైనా స్వాతంత్ర్యాన్ని గుర్తించే పద్ధతిలో యుద్ధ విరమణ సంప్రదింపులు జరపటానికి తాను సిద్ధమేనని వీట్మిన్ నాయకుడు డా॥ హోచిమిన్ ప్రతిపాదించినట్లు వచ్చిన వార్తలను వీట్నాం పత్రికలన్నీ వీట్నాం ప్రభుత్వ ఉత్తర్వుల ననుసరించి సెన్సార్ చేసినవి. ఆ ప్రతిపాదనలమీద వ్యాఖ్యానించటానికి బావ్ దాయ్ నిరాకరించారు.

హోచిమిన్ ప్రతిపాదనలే నిజమయితే, అవి ఫ్రెంచి వర్గాల సూచనలకు జవాబులే అవుతాయనీ, వీట్నాం అధికారులెవ్వరూ అసూచనలు చేయలేదు కనుక, వాటిని గురించి తాము అపాదించేది లేదనీ వీట్నాం వర్గాలు ...

## దేవనాగరిలిపిలో సంస్కరణలు

### డా॥ రఘువీర వివరణ

లక్నో, డిశంబరు 1: దేవనాగరి లిపి సంస్కరణసమావేశం చేసిన మార్పులను అని, ముద్రాక్షరశాలలూ అములో పెట్టేటట్లుగా రాష్ట్రప్రభుత్వాలన్నీ చర్యతీసుకోవాలని భారతీయ సంస్కృతి అంతర్జాతీయ పరిషత్ అధ్యక్షుడు డా॥ రఘువీర నేడిక్కడ విలేఖరుల గోష్ఠిలో సూచించారు.

నాగరిలిపి సంస్కరణ సమావేశం ఈ కింది ముఖ్యమార్పులను ఆమోదించిందని ఆయన తెలియజేశారు.

## పాకిస్తాన్ స్థావరాలకై అమెరికా రాయబారాలు: కఠిన రష్యా అధిక్షేపణ

లండన్, డిసెంబరు 1: పాకిస్తాన్‌లో అమెరికా సైనిక స్థావరాల ఏర్పాటు విషయమై ఉభయదేశాలకూ జరుగుతున్న వసే ఉత్తర ప్రత్యుత్తరాలవల్ల సోవియట్ రష్యా అధిక్షేపణ తెలిపింది.

మధ్యప్రాచ్య ముఠా నొకదానిని ఏర్పాటుచేసే ప్రయత్నాలలో పాకిస్తాన్ పాల్గొన నుద్దేశించడం పట్లకూడా రష్యా అధిక్షేపణ తెలిపింది.

ఈ అధిక్షేపణ శ్రీ ముఖాన్ని పాకిస్తానోని రష్యారాయబారి నిన్న పాక్ తాత్కాలిక విదేశాంగ మంత్రికి అందచేసినట్లు సోవియట్ అధికార వార్తాసంస్థ 'టాస్' ప్రకటించింది.

సోవియట్ శ్రీముఖం ఈ విధంగా వుంది. పాకిస్తాన్ పైన పేర్కొన్న ఒడంబడిక చేసుకోవడము, ప్రయత్నాలలో పాల్గొనడము ...

## విశ్వనాథంగారి ఢిల్లీ ప్రయాణం 7-వ తేదీన

(ఆంధ్రపత్రిక విలేఖరి)

కర్నూలు, డిసెంబరు 2: పంచవర్ష ప్రణాళికలో చేర్చవలసిన ...

## అసెంబ్లీ నిర్ణయం: మంత్రివర్గ పక్ష వైఖరి

(1-వ పేజీ తరువాయి)

ఇవ్వనవసరం లేదన్నారు. మంత్రులకు జీతం వెయ్యిరూపాయిలా లేక అయిదు వందల రూపాయలా అనేది పరిగణించవలసిన విషయం కాదని కూడా ఆయన అన్నారు.

ప్రతిపక్షం తరఫున వావిలాలగోపాలకృష్ణయ్య (స్వతంత్ర) గారు ప్రతిపాదించిన ఈసవరణవల్ల ఒక్కొక్క మంత్రి జీతం నెలకు వెయ్యి రూపాయలనుంచి అయిదు వందల రూపాయలకు తగ్గింది.

ఈబిల్లుమీద జరిగిన చర్చలో ఎన్. సుబ్బారెడ్డి (ప్రజా సోషలిస్టు) గారు మాట్లాడుతూ మంత్రిపదవులకు అనేక మంది ఎగబడకుండా వుండడానికి మంత్రుల జీతాలు తగ్గించటం అవసరమన్నారు.

లక్ష్మణస్వామి (కమ్యూనిస్టు) గారు మాట్లాడుతూ ప్రభుత్వం ఖర్చు తగ్గించాలని విజ్ఞప్తి చేశారు. శాసనసభ్యుల జీతాలు పెంచవలసిన అవసరం కనిపించడం లేదనికూడా ఆయన అన్నారు.

టి. మల్లయ్య (కాంగ్రెసు) గారు మాట్లాడుతూ శాసనసభ్యుల పరిస్థితి ... హీనంగావున్నదన్నారు. ...

(కమ్యూనిస్టు) గారు అందుకు సమాధానం చెబుతూ సవరణలమీద వోటింగ్ జరిగిన పద్ధతివల్ల ప్రభుత్వ వసకడి కూడా విశదమవుతున్నదన్నారు.

ఆ తరువాత ఆ సవరణమీద వోటింగ్ జరిగింది. అనుకూలంగా యాభై తొమ్మిది, ప్రతికూలంగా యాభై మూడు వోట్లు వచ్చాయి. కనుక ఆ సవరణ ఓడిపోయింది.

వావిలాల గోపాలకృష్ణయ్య గారి సవరణతో సహా అసెంబ్లీ ఈ బిల్లును శాసనంగా ఆమోదించిన తరువాత కాలనిర్ణయం లేకుండా అసెంబ్లీసమావేశం వాయిదాపడింది. నవంబరు 23 నుంచి నేటివరకూ అంటే మొత్తం ఎనిమిదిరోజులు ఈ ఆంధ్ర రాష్ట్ర శాసనసభ తొలిసమావేశం జరిగింది.

## చేనేతకు సహాయం

(1 వ పేజీ తరువాయి)

చుటకు గాను పరిశోధనకు- రెడీమేడ్ 'వార్డులు' సరఫరాకు 50 వేల రూ.లు స్థాపించు వస్త్రముల తెలిఫీ 37,500 రూ. లు 8. సహకారోద్యమం లోకి 50 వేలమంది చేనేత వారిని కలుపుకొని వచ్చుటకు 10 లక్షల రూ. లు మొత్తం 5087500 రూ. లు

ఇదివరకే కేటాయించబడిన 125 లక్షల రూ. లకు తోడు (అవిభక్త మద్రాసుకు) మరో 23 లక్షల రూ. లను సెస్సునిధినుంచి అవిభక్త మద్రాసు రాష్ట్రానికి కేంద్రప్రభుత్వం ...

## రోడ్డు బ్రిడ్జి స్కీములు సమన్వయం

### రాష్ట్రప్రభుత్వ పరిశీలన?

కర్నూలు, డిసెంబరు 2. కేంద్రప్రభుత్వంవద్ద నుంచి ఒక సమగ్రమైన ఆర్థికగ్రాంటు పొందేనిమిత్తం గౌతమి గోదావరి, వాశిష్ఠగోదావరి, రోడ్డుబ్రిడ్జిస్కీముల సమన్వయ పరచాలని ప్రభుత్వం వుద్దేశిస్తున్నట్లు తెలుస్తున్నది.

కేంద్రప్రభుత్వం గౌతమిరోడ్డు బ్రిడ్జిస్కీము యిదివరకే ఆమోదించి వున్నది. అచట పని త్వరలో ప్రారంభం కాగలదని తెలిసిన విషయమే. మద్రాసు-కలకత్తా మార్గంలోని ప్రయాణపు రద్దీని తగ్గించుటకు యీ రెండు పథకాలు అవసరం. వీటి నిర్మాణానికి సమగ్రమైన అంచనా వేయవలసివున్నది. ప్రస్తుతానికి ఆలమూరువద్ద గౌతమి రోడ్డు బ్రిడ్జి మూలంగా సెంట్రల్ డెల్టా-పశ్చిమ ప్రాంతముల్లో ప్రయాణం వీలవుతుంది. గుండుగోలను నుంచి వచ్చే రోడ్డును ఆలమూరుకు పంపవలసి వున్నది. దీనివలన మరొక 20 మైళ్ళ దూరం తగ్గిపోతుంది. ఈ రెండు రోడ్డు బ్రిడ్జిలను కలుపుతూ వేసేరోడ్డుకు 2 కోట్ల 1 లక్ష రూ. లు ఖర్చు కాగలదని అంచనా.

గౌతమి రోడ్డు బ్రిడ్జి పనినిత్వరమే ప్రారంభించాలని ...

## ఏప్రిల్ లోగా మద్రాసులోని ఆంధ్ర ప్రభుత్వ కార్యాలయాల తరలింపు

### —విశ్వనాథంగారి వివరణ

కర్నూలు, డిసెంబరు 2: ఎట్టి అవరోధాలు కలుగకుండా వుండేపక్షంలో మద్రాసులోని ఆంధ్రప్రభుత్వ కార్యాలయాలు ఆంధ్రరాష్ట్రానికి 1954 ఏప్రిల్‌లోగా తరలించాలని ప్రభుత్వం వుద్దేశిస్తున్నదని ఆర్థికమంత్రి శ్రీ విశ్వనాథంగారు నేడిక్కడ చెప్పారు. అయితే ఏ ప్రాంతాలకు యీ కార్యాలయాలు తరలించేదీ ఇప్పుడు చెప్పలేననీ మద్రాసులో 2500 మంది ఆంధ్రప్రభుత్వోద్యోగులు కలరనీ వీరందరికీ వసతి చూడవలసివున్నదనీకూడ అన్నారు.

(స్వ. వి.)

